శైవప్రచారిణీ గ్రంథమాల. ౧౯

సంపాదకులు.

కొడిమేల రాజలింగా రాధ్యులు

# శివయోగ సారము

ద్వితీయ సంపుటము.







గ్రంథకర్త

కొలని యాది గణపతి దేవుడు

శైవప్రచారిణీ గ్రంథమాల ౧౫

# శివయోగసారము

రెండవ సంపుటము.

ఇది

బ్ర॥ శ్రీ॥ విద్వాన్ ముదిగొండ వీరేశలింగ శాస్త్రిగారిచేఁ

తాత్పర్యము వ్రాయఁబడి,

బ్ర॥ శ్రీ॥ కొంజీమేల రాజలింగారాధ్యుల వారిచే

శైవప్రచారిణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

కాపీలు. ౧౦౦౦

1927

చందాదారులకు వెల 1-0-0

ఇతరులకు వెల 1-4-0

# విషయసూచిక

—— :*: ——

## శివయోగ సారము— ఉత్తరభాగము— ద్వితీయాశ్వాసము.


| విషయము | | పుట |
|---|---|---|
| ౧ అరిషడ్వర్గ లక్షణము | ... | ౨ |
| ౨ కామ స్వరూపము | ... | ,, |
| ౩ కామ మహిమ | ... | ౫ |
| ౪ క్రోధ స్వరూపము | ... | ౧౪ |
| ౫ లోభ స్వరూపము | ... | ౧౭ |
| ౬ మోహ స్వరూపము | ... | ౨౨ |
| ౭ మద లక్షణము | ... | ౨౮ |
| ౮ మాత్సర్య లక్షణము | ... | ౩౧ |
| ౯ అరిష్ట లక్షణము | ... | ౩౭ |
| ౧౦ కర్మ విచారము | ... | ౪౨ |
| ౧౧ శరీరతీర్థ వివరణము | ... | ౪౮ |
| ౧౨ కర్మయజ్ఞ దూషణము | ... | ౪౯ |
| ౧౩ జ్ఞానయజ్ఞ ప్రాశస్త్యము | ... | ౫౦ |
| ౧౪ జగత్కర్త యీశ్వరుఁడని నిరూపించుట | | ౫౬ |
| ౧౫ గురుశిష్య సంవాదము | ... | ౬౦ |
| ౧౬ గురుశిష్య సోదర చర్యాజ్ఞాన విచారము | | ౬౨ |
| ౧౭ ఇతరుల కొనర్చు హితాహిత కర్మఫల విచారము | | ౬౩ |
| ౧౮ యోగప్రాశస్త్యము | ... | ౬౪ |
| ౧౯ మాయా విచారము | ... | ౬౮ |
| ౨౦ శివాశివాది నామంబులు గల వస్తువిచారము | | ౬౯ |

# విషయసూచిక.

| విషయము | | పుట |
|---|---|---|
| ౨౧ మృత్యు లక్షణ విచారము | ... | ౭౨ |
| ౨౨ తనుత్రియ విచారము | ... | ౭౭ |
| ౨౩ యోగ విచారము | ... | ౭౯ |
| ౨౪ రాజయోగ మహిమ | ... | ౮౧ |
| ౨౫ హఠయోగ ప్రభావము | ... | ౮౫ |
| ౨౬ అష్టాంగ విచారము. | ... | ౮౯ |
| ౨౭ అనుబాధము. | ... | ౯౩ |

సమాప్తము.





శ్రీ రాజేశ్వరాయనమః

# శివయోగసారము

## ఉత్తర భాగము.

### ద్వితీయాశ్వాసము.





క. శ్రీ శివయోగ జ్ఞా
నాకర మహనీయ మూర్తి యతులిత కీర్తి
స్వీకృత గురువైభవ య
స్వీకృత భవసంక నార్య! శ్రీగురు వర్యా! ౧

తా. సర్వ సంపదల కాలవాల మగు శివయోగ జ్ఞాన మహిమచే సంసార సముద్రమును దాటి కీర్తిశాలివై వెలయుచు నూకనారాధ్యుఁడవను పేరుచేఁబ్రకాశించు చున్న గురువర్యా!

ఆ. వె. శైవ యోగశాస్త్ర సారస ముచ్చయ
ప్రకరణముల యుక్తి భావములను
వెలుఁగు కవితఁ దేట తెలివిగ సభవ
దాజ్ఞ విన్నవింతు నవధరింపు. ౨

తా. మీయాజ్ఞవలన సారభూతమైన శివయోగ శాస్త్రము సంక్షేపముగా వినుపించెదను

సులభముగ బోధించెద వినుండు.

## అరిషడ్వర్గ లక్షణము.

క. నెఱి వెలుపలి వారలనం
దఱ గెలిచిన నైన నది వృథా పాకంబే
తెఱంగున నైనను లోనిప
గఱ గెలుచుట యది విరక్తి గరిమం బయ్యెన్. 3

తా. బాహ్య శత్రువుల గెల్చుటది యొక గొప్ప కాదు. లోపలనున్న కామక్రోధ లోభ మోహమద మాత్సర్యములను అంతరంగశత్రువులను జయించవలెను.

క. కామము క్రోధము లోభము
వ్యామోహము మదము మత్సరా టోపంబుల్
నామది బ్రబలిన యరి
స్తోమంబును వరుసం జాఱ ద్రోలంగవలయున్. ౪

తా. మనంబునం బ్రబలియున్న కామక్రోధాదుల నారింటిని క్రమంబుగా జయింపవలెను.

వ. అవ్విధం బెట్టిదనిన. ౫

తా. ఆయరి షడ్వర్గ విజయ మెట్లుం జేయవలయు ననిన

## కామ స్వరూపము.

క. తొల్లిటి నిజకర్మ ఫలము
లెల్లం బ్రాపునకుం గొలదిగ నట్లయ్యెన్
ఎల్లపుడుం బొందియుండగ
నుల్లములో నెందు గోరుట లుచితంబగునే. ౬

తా. అప్పటప్పుడు దొరకయుండే నటులం బూనుపూర్వ జన్మంబునం జేసినకర్మ ఫలానుభవమున నేగదా! యీదేహంబు ధరించినది. ఈవిషయము తెలిసియుం దిరిగి కోరికలం గోరుట యుచితమగునా?

తము గలుగుటను నజహరి
ప్రముఖుల పదవులును దుఃఖ బహుళములు గదా. ౧౦

తా. ఈ రాజ్యములఁ గోరిన దేవతలకే సుఖములేదు. ఇంద్రాదులు స్వర్గాధిపత్యము వహించి తమకంటె బలవంతులగు రాక్షసులచేఁ బరాభవింపఁ బడిరి ఇంద్రునికన్న గొప్పవాఁడు బ్రహ్మయు- బ్రహ్మకన్న గొప్పవాఁడు విష్ణువు నుండుట చేతను, స్వర్గముకంటె సత్యలోకము- సత్యలోకముకంటె వైకుంఠము- నుండుటచేతను, వానికిఁ బ్రళయ కాలములందు వినాశము గల్గుటచేత విష్ణ్వాది దేవతలస్థానములు దుఃఖభూయిష్ఠములు.

క. వనజాసనేంద్ర పదవులు
ననఘులు మదిలోనఁ గోర రనిశ ప్రసక్తిన్
దనరు తాముల భూలో
కవనితాసుఖంబుఁ గోరు కష్టులు గలరే. ౧౧

తా. బ్రహ్మాది దేవతల స్థానములే తత్త్వజ్ఞులు గోరరని వచించినచో, క్షణికములగు పరిచ్ఛిన్న వనితాది భోగములఁ గోరుమూఢు లుందురా?

క. కామము సంకల్పంబునఁ
గామము జనియించు దీని క్రమ మెఱిఁగి జనుం
డేమియు సంకల్పింపక
తామసగుణ ముడిగెనేని తత్త్వజ్ఞుఁ డగున్. ౧౨

తా. ఈ కామము [కోరిక] సంకల్పమునఁ బుట్టుచున్నది. ఈ విషయమును మానవులు దెలిసికొని, తామస గుణము వలన కలిగెడి సంకల్పమునే వదిలి తత్త్వజ్ఞానులగుదురు.

క. కామింప వలవ దెద్దియుఁ
గామించిన మోక్షసుఖముఁ గామింపఁ దగున్
భూమినట మీదఁ మోక్షముఁ
గామించుట మిగుల బుద్ధి గాదండ్రు బుధుల్. ౧౩

తా. ఏదియుఁ గోర కూడదు. కోరినచో భూమియందు మోక్ష సుఖమువంటి సుఖమును గోరవచ్చును. అటుమీదఁ దిరిగి మోక్షమే కావలయునని కోరుట తగదని పండితులు చెప్పుదురు.

ష్పర స్త్రీలంపటులై యున్నను, కాముకులై స్వర్గాధిపతి యగు ముని భార్యయగు నహల్యను, గామించెను. కాన నేమనగా:— హృదయమున బొడమిన కామాగ్ని వలన దహించబడు మందులు మంచిచెడ్డలను బాటించుట గాంచ నేరని యభిప్రాయము లుండుటయే.

శ్లో॥ అర్థాతురాణాం న సుహృన్న బంధుః। క్షుధాతురాణాం న రుచిర్న పక్వం।
విద్యాతురాణాం న సుఖం న నిద్రా। కామాతురాణాం న భయం న లజ్జా॥

తా. ధనాశ గలవారు బంధువులని గురువులని తెలియక ధనమార్జింతురు. ఆకలిగలవారు రుచియున్నదని గాని, లేదని గాని, పక్వమైనదని గాని, లేదని గాని, యెంచక భుజింతురు విద్యావ్యసనము గలవారు సుఖమును గాని, నిద్రను గాని చక్కగా ననుభవింపరు. కామాతురులగు పురుషులకు లజ్జాభయములు లేవని తాత్పర్యము.

సీ. దుర్మదాహంకార । దుష్కృత్యదుర్గుణ
ఘనులై బుద్ధిహీ । నులగుచు
దాంతి శాంతి క్షాంతి । ధర్మదయాదాన
దూరులై పన్నగ । క్రూరులగుచు
గాయక నటవిట । గణికాది దుర్జన
మిత్రులై సజ్జన । శత్రులగుచు
బహుళ వృథాజల్ప । పరపీడ నాన్యాయ
నిరతులై దుర్మార్గ । చరితులగుచుఁ
తే. గీ. ధాత్రిమెలఁగెడి చెనఁటి నృ । పతులయిండ్ల
కెట్టినియతాత్ములకు నైన । నేఁగఁజేసి
ద్వారసీమలయందు వారింప । వారినచట
నిలువఁబెట్టుఁగా మముగాదె । నెట్టనముగ. ౨౧

తా. ధనమదాంధులై కన్నుమిన్ను గానక, దయాధర్మములు- శమదమములు, విడిచి వేశ్యాలోలులై సంచరించుచు, దుర్జనసహవాసము నాపేక్షించుచున్న పాత్రాపాత్ర విచక్షణతలేని రాజాధముల ద్వారములనొద్దకు నెట్టి సజ్జనులనైనను, ఎట్టి మహాత్ములనైనను ఖండించి నిలవబెట్టునది యీ కామమే గదా?

ఆ. వె. ఎంతవారలైన నెంతయుఁ బాటులఁ
బఱచు మనసున నింకఁ బ్రజ్ఞ లేల?
హీనజనులఁ జేయు నింతటి ఘనపాప
కర్మహేతువైన కామమునకు. ౧౩

తా. పాపములకు హేతువగు నీ కామము, ఎంతటి మహనీయులనైనఁ బరిహాసపాత్రులను గాఁ జేయుచుండ, హీనుల విషయమై యడుగనేల?.

క. కామంబు కతమునఁ గల
నేమంబులు విప్రతతులు నీరజ ముఖులున్
ధామములు మొదలు గాఁ గల
నేమియు నెల్లక చెడుదురు దుర్ధషత్రుల్. ౧౪

తా. సత్పురుషులు కామ భయమున నే స్త్రీలు, కన్యలు, గృహములు, మొదలగు వాని వదలి పెట్టుదురు.

క. భువిఁ గామ యుక్తిఁ గలవై
భవములు విషగర్భ మధుర ఫలములు కామం
బువలన వచ్చు దుఃఖంబులు
ఉపరి యమృత కరములైన తిక్తౌషధముల్. ౧౫

తా. జ్వర పీడితునకు, మధుర పదార్థము విషమైన ఫలములను, చేదు పదార్థ మమృతమైన ఫలములను, మోక్షము నందు భిలాషగల వానికిఁ గామమువలన సంభవించెడి వైభవములు, విషమయ ములును, అందు వలన వచ్చెడి దుఃఖములు, అమృత మయ ములును నగును.

క. పంచ మహాపాపములకుఁ
బంచల గతినుండఁదగిన సదనము కామం
బంచితము బ్రహ్మచారం
బెంచఁగ యుసు గలుగనేర పెట్టినైనన్ ౧౬

తా. కామము పంచమహా పాతకములకు నివాసము. కామాసక్తుఁడగు వానికే సమయ మందును సదాచారము గలుగదు. పంచమహాపాతకములేవియనః-బ్రహ్మహత్య. క..

ద్రాగుట, బంగారము దొంగిలించుట, గురుభార్యను బొందుట, ఈ నలుగురిలో నెవరితో నైన గూడి యుండుట.

క. విదితంబుగా విరక్తిం
బొదలక సంసారమాయం బొందుతదీయా
స్పదమెద్ది యనినజముగ
మదిఁజూడఁగఁ బుష్పశరుని మాయయెకాదే. ౨౭

తా. జనులకు వైరాగ్యము గలుగక సంసారము నందలి ప్రేమ గలుగుటకుఁ గారణము మన్మథ మాయయే గదా?.

ఆ. వె. మరుని మాయవలన మఱుగుటెవ్వఁడు
వాఁడు దోషకారి వానిచేత
నమర వరులు మునులు నభిమానములు గోలు
పోయి మిగుల మోస పోయినారు. ౨౮

తా. మన్మథ మాయకులో బడుట మానవులకు నుచితము గాదు. ఆమారుని చేతనే బ్రహ్మ తిలోత్తమ యందును, విష్ణువు, గోపిక లందును, రుద్రుఁడు మునిభార్యల యందును దగుల్కొని వారు. మహారణ్యము నందుఁ గంద మూలఫలములఁ దినుచు సాక్షి సుఖము గాంచని ఋష్యశృంగాదిమునులు సదా వేశ్యా రత్నముల పాదపద్మములందు దాసులై పడియుండి యాత్మ గౌరవమును గోల్పోయినారు.

క. పేయును నోటికి మన్మథు
మాయతలోలుత జవికిఁజూడ మధురము సహజం
బైయున్న విషం బిదియక
డాయెందును మోసపోక తనరుట యెవ్వాఁ. ౨౯

తా. పలుమాటలతోఁ బనియేమి? కాంతా సంభోగాది మదన చేష్టలు చవిచూచి నంతనే రుచితో మధురముగా నుండును. విచారింపగా నంతటి విషములేదు. కావున పంచబాణుని కుసుమ బాణముల వలన మోసపోకుడు.

క. కామిను లనిరంతరంబును
దామొందఱు సమరనొద్ది తరుణుల నెడియు

ద్దామంపుట్టుపులఁ దగులుచు
నేమఱియుండంగ వలవ దిటనియతునకున్. ౩౦

తా. కాముఁడను వేటకాఁడు పురుషులను మృగములఁ బట్టుకొనుటకై నారీరత్నములను వలలను బన్నినవాఁడై యున్నాఁడు. కాన జాగరూకులు గండు.

క. కనుఁ జెల్లఁ బెంట్రుకలును
బడఁబారియొడలు నోడలఁ గలిగి ప్రాయంబోయినాఁ
డుడిపోవుట గల్గినమదిఁ
గడపోదుగదా మనోజు గర్వంబెప్పుడున్. ౩౧

తా. వెంట్రుకలు నెరయుచుండియు, శరీరము ముసలి తనమున పనదప్పుటయు గలిగినను, దానిమహిమయే మోగాని, కామము మాత్రము పోవదు గదా?.

సీ. కపటంబు పోకయుఁ గ్రతి క్రోవసద్గతి
మఱపు సత్యంబులకునికి పట్టు
పరధనహారియుఁ బ్లురముల చక్కఁదా
బోరనరకంబున ప్రాప్తికారి
ధర్మబ్రహ్మత్రేకంబు ధరపటలంబిది
యభిమాన పిపిదా వాగ్నిమూర్తి
వృషుతరద్రోహకారి త్రీధరకులిశంబు
కులశీలములు రెంటుకు పోలయు నెలవు

తే. గీ. తగులువడి పాయఁగా రాని బిగువుఁ గాంచి
యుపయశః ప్రాప్తులకునెల్ల వాలయంబు
వితతసద్గుణ రాశికిఁ బెన్నుగుపియ
మరునిమాయ యొకారణమునఁ బొందియుఁ గలదె. ౩౨

తా. మన్మథుని మాయలోఁ బడిన జనుఁడు చేయు పనులు, మాటలాడు వచనములు, అన్నియు దోషభూయిష్ఠములు. అతఁడు కామాధీనుఁడై యనృతములు పల్కును, పరధనముల నపహరించును. అధర్మము లాచరించును. అభిమానము విడుచును. కులశీలము లుద్యజించును. చివర కపకీర్తి పాలగుట యగాక నరకము గూడ ననుభవించును.

ఉ. లేఁతలలోన నెల్లఁగడు లేఁతకృతాంతుని సమ్ముఖంబు దా
రోఁతలకెల్లఁ బుట్టినిలు రోషముకంటెను మృత్యుమూర్తి పె
న్నాతి సమస్త దోషములు నుండెడు నిక్కఁగడంగి యొప్పదుం
జేటికిఁ జేటుగాఁ బ్రబలెఁ దిరిఁ జిత్తజు మాయఁదలంచి చూడఁగన్. 33

తా. సుకుమారములగు వస్తువులలో మిక్కిలి సుకుమారము, యమపురి కేఁగుటకు ద్వారము, సకల పాపముల కాలయము, మన్మథ మాయయే గదా?.

క. అసము విరక్తుల మనుచుం
బసరింపుచు కేలకోసక భలకొందఱు దా
రసమాత్ముఁడొకఁడు దక్కఁగ
గుసుమాస్త్రుని కెవ్వరిపుర కగుదురూహింపఁగన్. ౩౪

తా. "మేము విరాగులము, మేము, విరాగులము-" అను సభలలోఁ గొందఱు ప్రజలు సంతోషించుటకై పల్కుదురు; గాని, నిజము విచారింపఁ గాఁ బుష్ప బాణుని గెల్చిన మహాను భావుఁ డీశ్వరుఁ డొక్కరుఁడే గదా?.

—* ఉత్సాహ *—

తామసులకెప్పుడు సీటిలోనఁ దేలుచుండు వారిత
ధ్యముగఁ గరకకాయల దినక మైనవారిఁగా విగో
ణములఁ గట్టువారినైన వగుచుఁ జిత్తజుండు చి
త్తము గలంచి చెఱుచునవ్వె ధనములు దప్పమల్గదా. 3౫

తా. ఉదః కాలమునకే లేచి నిత్యకృత్యముల దీర్చికొని యెంతటి శీత లోదకంబులైనను "శివ- శివా" యని మునుంగుచు; గరక కాయలఁ దినుచుఁ, గావి గోచీల బిగించికొని తపంబొనర్చు విశ్వామిత్రాది మునీంద్రుల నైనను మదనుఁడు తన కుసుమబాణములకు గురిఁగాఁ జేయ లేదు?.

చ. మనసిజకేళి నేర్పునను మానవిలాసములోలి లోలలో
చనగురువంపు చందమునఁ జయ్యనగోమల హాస్యహల్లకం
బునఁగొనఁ జెట్టవట్టిరతిఁ బొందునకీయకొనంగఁ జేయుఁజూ
చినధృతి కల్మినెల్లనుఁ జిష్టుగదా శివయోగి యెల్లెడన్. 3౬

తా. రతికేళియందు పాండిత్యము గడించి, యపాంగ ప్రసారము లందు చాతుర్యము నార్జించి, మాటల యందునైపుణ్యము సంపాదించి, తళుకుల్కు బెళుకులచే, సహజలావణ్యముచే నెంతటి ధీరునైనను జేపట్టి నిమిషములో స్వాధీనము జేసి కొను కాంతామణి వచ్చి యాచించినను, ఏ మహాత్ముఁడు మనస్ఫూర్తిగ నిరాకరించునో, ఆతఁడే శివయోగిసుమీ.

క. కామాతురునకు నిహ్రప
సేమంబను మాటనటుల ఱేఁబును నిజముం
జేమియు సందియము వలన
దామీఁదఁ బరత్రహాని యగునందురు బుధుల్. ౩౬

తా. కాముకునకు, నిహలోకమున సుఖము కలుగునో లేదో సంశయము; గాని క్షీణమాత్రము తప్పక కలుగును. ఇందుకు సందియము లేదు. కామలోలునికి పరలోకము న హానికలుగుట సత్యమని విద్వాంసు లందురు.

వ. కావున. ౩౭

తా. కాబట్టి.

క. మాటలు వేయుం జెప్పఁగ
నేటికిఁదను నాత్మఁ జూడనీక సతతమున్
మాటైయున్నమ నోజుని
గీటణఁపక శివునిజూడు క్రియ యొప్పదునే. ౩౮

తా. వేయి మాటలతోఁ బనియేమి? తనను, యాత్మయందుఁ జూడనీయక యడ్డముగా నున్న మన్మథుని జంపక శివుని జూచుటకు వీలులేదు.

తే. గీ. తనకుఁ బుట్టినమన సిజుఁ । దానఁగెడఁగి
పట్టికుదియించి తాళిచుఁ । బెట్టలేఁడు
తెలిసి విశ్వాధికుని మహా । దేవుఁబట్టి
లోపఱుచు కొనసేర్చు చా । లునుజనుండు. ౩౯

తా. తనకు జన్మించిన వాఁడగు మనసిజుని దండింప శక్తిలేని వారలు- విశ్వాధికుఁడగు మహాదేవునిలోఁ బరచుకొను శక్తిగల వారగుదురా?

మ. పరవిత్తంబు నమాత్రమైనఁ బొరయక । భావింపకేభంగులం
బరకాంతం బరికింప కెట్టి యెడలన్ । భద్రంబుగాఁ జూచుచుం
బరితృప్తి స్థితినున్న భావభవుని । భజింపుచా నిక్రియం
బరమజ్ఞానుల కెట్టి కామహరణో । పాయంబె యెఱుఁగం దగున్. ౪౦

తా. పరధనమును మట్టివలెఁ దలంచుటయు- పరకాంతలఁ దల్లులవలె భావించుటయు, సదా పరమేశ్వరు నుతించుటయు, కామమును ణంచుటకుఁ దగిన యుపాయములు

వ. అదియుం గాక. ౪౧

తా. అంతియ గాక.

క. వేశకత్తెలఁ బరనారులఁ
జూడంగా వలను తప్పి । చూడఁ బడినఁదాఁ
దోషం బుట్టిన వారల
తోడియుటులు చూడఁదగు న । తులధైర్యమునన్ ౪౨

తా. పరస్త్రీలను, జూచుటయే మంచిది కాదు. చూచినచోఁ దన సహోదరీమణులతోఁ బాటు చూడవలయును.

క. ఈలాగునఁ జరియింపఁగఁ
మారుని భావజుని మాయఁ । దూలఁడు ముక్తిన్
శ్రీలలఁ గల్గు ముక్తికి
మూలము వైరాగ్య మంద్రు । మునివరు లెల్లన్. ౪౩

తా. ఇటు చరించువాఁడు, మన్మథ మాయలోఁ బడక ముక్తినొందును. మునీంద్రులందఱు ముక్తికి వైరాగ్యమే మూలమనిరి.

## క్రోధస్వరూపము.



క. తొలితొలి శిఖితన పుట్టిన
యిలుగాల్పక యెరులయిండ్లు । కేఁచునె కోపా

తే. గీ. పానవేటికిఁ గ్రోధంబుఁ బాయలేని
పచ్చిమాలకు వేదోక్త భవ్యనిష్ఠ
లేమిటికి నేటి గురుభక్తి యేటిశివుని
భక్తి వానికి నెక్కడి భక్తి భక్తి. ౫౧

తా. క్రోధంబు వదలజాలని వానికి స్నానమేందుకు? వేదోక్త మంత్రాచరణము లెందుకు? గురుభక్తి యెందుకు? శివభక్తి యెందుకు? అట్టివాఁడు విచారింపగా చండాల సదృశుడగును సుమా? వానికిభక్తి యుండినను నిష్ఫలము.

ఆ. వె. ఎందుఁ గ్రోధయుతున కెక్కడి శివయోగ
విరాశ్వరునకు వాని కెన్నిచాళ్ల
పెట్టువానిని యమపెట్టి దైనను నది
రోఁతగాదె రాజ యుఁగని వెట్టి. ౫౨

తా. క్రోధముగల వానికి శివయోగ మబ్బనేరదు. అట్టి వాఁడు శివునిగూర్చి యెన్ని నియమముల వలంబించినను వ్యర్థము సుమా? రాజయుగని వెట్టిచేయుట వలన గష్టమధికమే గాని భోగంబులు మాత్రము లేదు సుమా?

క. మును క్రోధానలమితరుల
ఘనకౌటిల్యంబు వలన గలుగుట నదిదా
ననవరతంబును శమతా
వనధారలఁ జల్లనార్ప వలయు నిజముగాన్. ౫౩

తా. ఇతరుల కుటిల సంభాషణ ములనల్లను- ప్రవర్తనములనల్లను- క్రోధాగ్ని జనించుచుండును. బుద్ధిమంతుఁ డద్దానిని శాంతి యనెడి యుదక ధారలచేఁ జల్లార్చ చుండవలయును.

— * లోభ స్వరూపము. * —

ఉ. లోభము సర్వదుర్గుణములున్ వసియించిన చోటు దైథన
ప్రాభవ పుణ్యసంపదల వాయముఁ బొందఁగఁ జేయుసద్యశో
లాభముఁ జెంద నీదనిత లంచినఁ దానియతాత్ము లెన్నఁగా
లోభముపొంతఁ బోదుఘను లోపల నెంతయు బుద్ధిమంతులై

తా. లోభము సర్వ దుర్గుణముల కాలయము. అందువలన కీర్తి ప్రతిష్ఠలు నశించును. పుణ్యసంపద లడుగంటును. గానధీమంతులా లోభము పొంత బోక చరింతురు.

క. కలలోని జాడనస్థిర
ములు హేయంబులు నసార ములునై నధనం
బులులోభ పశులు సుస్థిర
ములయని మదినమ్మి మోస పోదురు జగతిన్. ౫౫

తా. కలయందుఁ జూచిన వస్తువులవలె నస్థిరములై తుచ్ఛంబులగు ధనంబులనే నమ్మి యసారమగు సంసారమున బడినీదులాడుచు దరి గానక లోభపిశాచమున నావరింపబడి కొందఱు సంచరింతురు. కాని యదియంత యునిష్ప్రయోజనము.

సీ. తల్లిదండ్రుల నైన దగు తరుణుల నైన
విడుతురు లోభంబు విడువలేక
నిజకుమారుల నైన సింధుబాలము నైన
విడుతురు లోభంబు విడువలేక
బంధుజనుల నైనఁ బరమ మిత్రుల నైన
విడుతురు లోభంబు విడువలేక
భవ్యశీలము నైన ప్రాణంబు లైనను
విడుతురు లోభంబు విడువలేక
గీ. వారిఁ గనుఁగొని లోభవి దూరు లైన
వారు నగుచుందురు సుఖి చారలీలఁ
జారునిర్వాణ లక్ష్మికి వారికారె
భర్త లగుదురు శివ యోగ భరితు లగుచు. ౫౬

తా. లోభులు గడ్డిగవ్వ యైనను ధనంబును వదలలేక తల్లిదండ్రుల నైనను- కుమారుల నైనను- భార్యల నైనను- బంధువుల నైనను- మిత్రుల నైనను- చివరకు ప్రాణము నైనను వదలిపెట్టుదురు. అకటా! ఇట్టివారిని జూచి లోభరహితులు నవ్వుచుందురు. విచారింపగా నిట్టి వారలే కదా? మోక్షలక్ష్మీకృపా కటాక్ష పాత్రులగు చున్నారు.

ఆ. వె. లోభి సూర్జనుండు లోభికెక్కడి శివ

భక్తి యేటి యోగ యుక్తి యెందు
వానికేల గల్గు శంభుభక్తిముక్తులు
వాఁడు సత్పథంబు వాఁడు గాఁడు. ౫౭

తా. లోభి యున్నవాఁడు సమానులు. శివయోగము గాని, శివభక్తి గాని లోభికిఁ గలుగనేరదు. సన్మార్గమున వాఁడెప్పుడు చరింపఁడు.

క. ఘనలోభుని యాత్మనిధన
మనలంబునఁ గాలు నొండె నంబుపులోఁ
జననాథుఁ జేరుఁ జోరులు
గొనిపోదురు మూషకములు గొనిపోవు నొగిన్. ౫౮

తా. లోభిధనము దొంగల పాలగును. లేనిచో నగ్నియందు గాలిపోవును. లేనిచో నుదకము పాలగును. కానిచో రాజుచే నపహరింపఁబడును. ఎవరికిఁ జేరనిచో మంటి పాలగును. సందియము లేదు.

క. గురువులకును దేవరకును
వరభక్తులకును మనీషి వరులకు దీనా
తురులకుఁ జేరును లోభము
బోరమని యనఘాత్మ ధనము బుధులు నుతింపన్. ౫౯

తా. లోభిత్వము లేనివాని ధనము దేవతలకు- గురువులకు- భక్తులకు- పండితులకు- దీనులకుఁ జేరును.

క. లోభము విడువఁగ నేరని
ప్రాభవ పురుషుండు నిత్య పటుయశుఁడు గదా
లోభము విడువఁగ నేర్చిన
ప్రాభవ పురుషుండు నిత్య పటుయశుఁడు గదా. ౬౦

తా. లోభమును విడువఁజాలని వాఁడు జీవించియును మరణించినవాఁడే. లోభమును విడిచినవాఁడు మరణించినను యశశ్శరీరమున జీవించియున్నవాఁడే యగును. లోభికి నపకీర్తియు- దాతకు కీర్తియు గలుగునని భావము.

ఆ. వె. అఖిల దోషములకు నాదికారణము మును

నపయ శంబువకుని। జాలయుంబు
నైనలోభమాత్మ। నంగీక రించుట
నియతము తులకెల్ల। నీతి గాదు. ౬౧

తా. సర్వదోషములు- అపకీర్తియు లోభంబువనే జనించును. కాన నీతిమంతులు లోభంబు విడువవలయును.

క. తనమది లోభము విడువక
యనఘుండ యోగీశ్వరుండ। నత్యంతతపో
ధనుఁడ సదాచార పరుఁడ
నను నెవ్వఁడు వానిమాట। లవిప్రల్లదముల్ ౬౨

తా. ఎవఁడు లోభమును విడువక నేనే యోగీశ్వరుఁడను- సదాచార పరుడను- తపోనిష్ఠాగరిష్ఠుఁడననియుఁ బలుకునో, అట్టి వానిమాట విశ్వసింప దగినది కాదు. వానిమాటలన్నియు నసత్యములేయని నమ్మవలయును.

సీ. ఘనతరంబగు లోభ। మునఁ గూడఁ బెట్టిన.
ధనమెల్ల విషసమం। బనియులోభ
విరహిత స్థితిగల। విదిత శాకాహార
మైనను నమృతోప। హారమనియు
తెలసిలోభ గుణంబు। తెంపుమై విడిచినఁ
బెంపుచాలను గల్గి। పృథులదాన
భోగవిహార సం। పూర్ణ స్వభావుని
శివపూజ నాసక్త। చిత్తులగుచు
తే. గీ. శివపురాణ శివస్తుతి। శివకథావి
నోదములఁ బ్రొద్దుపుచ్చు చుం। డుదురు శైవ
పరులు శివయోగ ఓదమృత। వార్ధినోల
లాడుచును శివుఁదక్కన। న్యంబులుడిగి. ౬౩

తా. శివయోగులు లోభమున నార్జించిన ధనమంతయు విషంబని తలంచి- లోభము లేకుండ నార్జించిన ధనము నమృతోప హారంబని తలంచి దానంబు లొనరించుదు-

భోగంబులను భవించుచు- శివపూజ నాచరించుచు- శివకథల వినుచు- శివ భజన సేయు చు- కాలము వెళ్లించెదరు.

క. చంచలములు ప్రాణములవి
చంచలములు సిరులుమిగుల౯ జంచలములుభా
వించఁగ పాయము లగుటయు
నించుకయును లోభ మొలవ దెయ్యేడనైనన్. ౬౪

తా. ప్రాణములే చంచలములు వానికంటె సంపదలు చంచలములు- వానికంటె యౌవనములు చంచలములు. కాఁబట్టిసజ్జను లీరహస్యము దెలిసికొని లోభ మును వదల వలయును.

సీ. వేయును నేటికి౯ విలయాగ్ని చేత న
గాధంబు లైనప౯ యోధు లేడు
నమృతాశ నావాస మగుమేరు మందర
హిమవ త్ప్రముఖ శైల౯ సముదయమును
గూడంగ నేఁబదికోటుల యోజనం
బులుగల ధారుణీ౯ తలము నిముష
మాత్రంబు లోనను౯ మాయ యోయన రజః
పటలమై పరమాణు౯ భాతినుండు
గీ. నవలి యంబరమును నిట్లు౯ యంబ రంబు
తక్క దక్కిన సకలభూ౯ తములు నంద
యడగు టెటిగియు నింకని౯త్యమని యేప
దార్థ మాశించి విడువలే౯ రకట నరులు. ౬౫

తా. అక్కటా! బడబాగ్ని సహితములై యతిగంభీరములగు సప్తసముద్రములు- జీవతుల కావాసములగు మేరుమందర హిమవత్పర్వతంబులు, ఏబదికోట్లు యోజనము లు గలయీభూమియంతయు, క్షణకాలములో పరమాణువువలె మెలంగుచునాకాశమున వి లీన మగుట తెలిసియు, ఏపదార్థము నిత్యమని భావించి జనులు లోభగుణమును విడువ రో గదా?

వ. కావున. ౬౬

తా. కాబట్టి,

క. కనుఁగొనఁగ జగంబంతయు
ననిత్యమని మదిదలంచు • నడియాస లోభం
బనుపగను సంహరించెను
ననువని యెఱుగంగ వలయు • నచలిత బుద్ధిన్. ౬౭

తా. జగంబంతయును నిత్యంబని మనంబునకు దోచి నచో, లోభంబుండ నేరదు.

—* మోహస్వరూపము. *—

సీ. మోహాంధకారంబు • ముక్తిత్రోవకు మఱుఁ
గైయుండు నని చెప్పి • రాదిమునులు
మోహంబు సాహసం • బున విడిచిన యుత్త
ములు దుర్భవాంబుధి • వలను జొరరు
వనితలు పుత్రులు • బంధులు మిత్రులు
పశువులు మొదలైన • బహుధనములు
ననయంబుఁ గూరిమి • జనియింప నవిఘటి
యింపంగ నవిచేయు • నెడలమనసు.

తే. గీ. లందు మనుడుగని దుఃఖాగ్ని • యందు నుసుకఁ
జేయు నురుతర పుణ్యులఁ • జేరి మోహ
మదియ కాదె యోగీంద్రుల • నైనఁ జెఱచు
మర్త్యులెంత సంయోగంబు • మరిగి నేని. ౬౮

తా. మోహపిశాచ గ్రస్తులగు మానవులకు ముక్తి మార్గము దొరుకదు. మోహంబు వదిలిన వారికి సంసార భయం బణుమాత్రము పొంద నవసరము లేదు. స్త్రీలు—కొమరులు బంధువులు— మిత్రులును— పశువులు— ధనము గృహము మొదలగు వాటి యందు కూరిమి గల్గుటయు— ఇందు నేదేని పోయి నపుడు మహాదుఃఖమును ననుభవించుటయు— మోహమని చెప్పఁ బడును. ఎంతటి మునీంద్రుల నైనను, నీమోహము తనవలలోఁ బడవేసికొనుచుండ మానవుల విషయమై చెప్పనేల?

క. అమ్మోహము సంగతి నిము

సన్మైనను నిలిచియున్న జనునకుఁ గడుగో
షమ్మగు నఁట తానని వా
సమ్మఁట మోహంబు సకల సంసారులకున్. ౬౯

తా. ఆమోహము నిముస మాత్రముండినను మహాదోషము సంభవించునుగాన సంసారులకు మోహము మహా సంకటము.

చ. ఉడుగక మోహ ముల్లమున నున్నకతంబున నేకతంబునన్
మృడు మదినిల్పి మర్త్యులును మెచ్చఁగ గొల్వగ లేరు సత్యముం
గడు నియమంబులున్ విహిత కర్మములుం దుది మోక్షలక్ష్మియుం
జెడు భవపాశ బంధములఁ జిక్కులు వీడవు మోహ సంగతిన్.

తా. మోహము వదలక యుండినచో, రహస్యస్థలంబున గూర్చుండి నను— మనస్సునిల్పి యీశ్వరుని గొల్వఁ జాలఁడు. అతఁడు నియమంబులు, సత్కర్మములు, పరిపాలింపకఁ బోఁగా సంసార పాశాబంధితుఁడై మోక్షలక్ష్మి నిగ్రహింపఁ జాలడు.

వ. మఱియు నత్యంత భక్తిపూర్వకంబుగా నిరంతరంబును హృదయ వాక్య ధన తను శుశ్రూషలు నాలుగింటను గురువులం గొలువనిదియును, శైవాగమోత్తరోక్తమార్గంబున నఖిల సుర ముని నికరావతరణ సమన్విత శివ లింగార్చనా విశేష కృత్యంబులఁ బరమానుమోదంబుల దినములు గడపనిదియును, వైదికాచార పరాయణులై శివుఁదక్క నన్యంబెఱుఁగక రాగద్వేష విరక్తులును, గురులింగ జంగమ భక్తియుక్తులును భవముక్తులు నతి పవిత్రులునైన మహాభక్తవరుల నింటికిఁ దెచ్చి యుచితక్రమంబున బూజించి యలరింపఁ జేయనిదియును, శివోదితంబైన యోగంబవలంబించి మహానుభావులైన శైవుల దర్శించుటకై వారలున్న యెడలకు జననిదియును, మనోవాక్కాయ కరణంబుల నచలితంబులైన తపంబులు గైకొననిదియును, సన్మార్గ వర్తులయిన పెద్దల బొడఁగని దయాభరిత భావంబునఁ బ్రోవనిదియును శివయోగీంద్రుల వల సయోగ రహస్యంబులు వినవలయునన్న విమలబుద్ధిజనింపనిదియు

ను, సరసగతి నతిచతుర వచన రచనల బ్రమరంబుగా గురు లింగ జంగమశివభక్తుల నభినుతించెడు గుణంబుజిహ్వకుఁగలుగనిదియును నశ్రౌత పాషండ శాక్తాది నానావిధ కుమతవర్తనుల యైన దురాత్ములఁ బరిత్యజింప నిగియును శివధర్మ తత్పరులై శిష్ట జనంబులైన శివయోగీంద్రులఁ జేరిభజింప నిదియును శివమహిమంబులుసెప్పు బహుపురాణ కథాసుధారసంబు కర్ణపుటంబులఁ గ్రోల నిదియును శివయోగ జ్ఞాన జనితా భ్యంతర నిరంతరని తాంతసుఖాను భవంబున నస్పందిత నిరుప మానందంబునం బొందనిదియును మోహంబని చెప్పం బడును. ఇవ్విధంబునమానవుల గ్రైవల్యహారులం జేయుచు జన్మజరామరణ స్వర్గనరక ప్రముఖ నిఖిల దుఃఖాకర నిస్సార సంసార వ్యాపారంబుల వలన నతివ్యాకుల హృదయులంగా నొనరించు నదియునుంగాక.

తా. గురువులను, మహాభక్తితో చతుర్విధ శుశ్రూషలు చేయవలయును. శివాగమోక్తరములందు జెప్పినవిధంబున శివలింగార్చన మాచరింప వలయును. శివుడప్పనమ్యలగొలువక రాగద్వేష రహితులు గురులింగ జంగమభక్తియుక్తులు మహాభక్తులనగు నారాధ్యశిఖామణుల నింటికిదెచ్చి పూజించవలయును శివయోగాభ్యాసులైన మహాత్ములున్నయెడకు జనవలయును. త్రికరణశుద్ధిగా దపంబాచరింపవలయును. సత్పురుషులగు పెద్దలదయాపాంగ ప్రసారంబులఁ జూడవలెను. యోగ రహస్యంబుల శివయోగులవద్దకేగి వినవలెను. గురు లింగజంగమ భక్తుల సంతోషమున నుతించవలెను. పాషండమతస్థుల త్యజించిశివధర్మ పరులగు శివయోగీంద్రుల గొలువ వలెను. శివమహిమా ప్రతిపాదితంబులైన శివపురాణంబులనాలకించవలెను. శివయోగ జ్ఞానంబున నాభ్యంతరపూజనం బాచరించి సదానందంబను భవింపవలెను. ఇవియన్నియు- చేయక పోవుటమోహంబునుబొందుటయని వచింపబడును. జన్మజరా మరణ స్వర్గనరక దుఃఖాదుల ననుభవింప జేయుచు కైవల్య దూరుగా జేయునది యీమోహమే సుమీ?

క. విలసిత సద్గుణ నివహం
బలలోపల మోహవశున కేటికి నింపొఁ
దలపోయ నెాఁడునదికి

మలయజ పంకంబుఁ గోరు మదికింపగునే. ౭౨

తా. మోహపరవశుఁడైన వానికి సద్గుణములు రుచింప నేరవు. పంది బురద మెచ్చునుగాని, పన్నీరు మెచ్చునా?

మ. వనితల్ దుర్మలభాండముల్ ధనము సర్వంబున్ ఘనంబైన దుః
ఖనిదానంబు సుతుల్ దురాత్ములయినం గష్టంబుగా నన్వయం
బునకున్ దుర్గతిఁ బొందఁ జేయుదురు నన్ రోర్మోహాత్ముఁడీచందముల్
గనియున్ వేడ్కఁ దదీషణత్రితయ కాంక్షన్ మోహబుద్ధిన్ సదా యేలకో?

తా. వనితలా? దుర్మలముల కాకరములు- కుచేష్టలకు- దుర్బోధలకు నిలయము లు. ధనమా? సకలదుఃఖములకు నిలయము సుతులా? దురాత్ములయినచో వంశమునకు కళంక మాపాదింతురు. ఈవిషయము లన్నియుఁ జూచుచునే మోహపరవశులై మానవులు ఈషణత్రయము నందు పేక్ష వహించుట యెందుకో దెలియదు.

క. ధర్మవిరుద్ధ పథంబులు
దుర్మతులై చూపుచుందురు బాంధవులున్
దుర్మతులు వారలమోహఁ
గూర్మి పొడము మోహినైన కుమతికి నెపుడున్. ౭౪

తా. బాంధవులును- దుష్టబుద్ధిగలవారైరి యధర్మమార్గములనే బోధింతురు. మోహపరుడగు వానికి దుర్మార్గుల యందే కూర్మిగలుగు చుండును.

ఉ. ఎట్టిపదార్థమైన భుజియించిన యప్పుడు దుర్మలంబ యౌ
నట్టి పదార్థ సంచయము నంగడనుంచి సహించుఁ బాపముల్
పుట్టిన రాజ్యసంపదలు సొంపులు గైకొనఁ గోరుచుండునే
పట్టున మోహయుక్తుఁడగు శాలికుఁ డెంతయు మోహ చిత్తుఁడై

తా. ఎంతటివిలువగలపదార్థమైనను- ఎంతటిరుచిగలపదార్థమైనను తినిన వెంటనే మల స్వరూపమునొందునుగదా? అట్టిపదార్థము నదను రాగమువహించుటయు- పాపసంకులము గు రాజ్యసంపదల కాంక్షించుటయు మోహయుక్తుడగు బాలిశుని కృత్యములు

తే. గీ. మఱపులును బోలె నిలుకడ లేని సౌఖ్యములకె

మిథ్యలగు దుర్భవస్థితులఁ మెచ్చియనుభ
వింపుచుండు మోహవశులై వివేకహీను
లగుచుఁ బరలోకచింత సేయంగ మఱచి. ౭౬

తా. పరలోక విచారమును మాత్రమునులేక వివేకములేక మెఱుపువలె క్షణకాలము కన్నులకు మిఱుమిట్లు గొల్పు కాంతామణుల మోహించి జనులునశించుచున్నారు.

క. మోహంబను శత్రుఁడు విధ
మూహింపఁగ దొడ్డవాఁడె యొక్కొక యెడఁ దా
నో హా! తజ్ఞులనైనన్
సాహసమున ముంచుఁ గ్రందయుఁ సంసారాబ్ధిన్. ౭౭

తా. శత్రువు లందరిలో మోహంబను శత్రువు మహాబలశాలి. ఆత డెంతటి పండితునినైనను సంసార సాగరమునఁ బైకితేలకుండ జుట్టుపట్టి ముంచుచుండును.

మాలినీవృత్తం. తెరువరు లొకచోటం ◆ దెల్లఁగాఁగూడి యట్ల్యో
పురములకు యథేచ్ఛం ◆ బోవుచుందంబు దోఁపం
బరువడి నెపుడున్ హా ◆ బంధు సంఘంబు గూడన్
విరియఁగఁ గనిమోహ ◆ వేశతం బొంద నేలా. ౭౮

తా. బాటసారు లందరొక్కచోఁ గూడి తెల్లవారి జాముననే లేచియెవరి పనులకు వారెటుల బోవుచుందురో, అటులే బంధువు లందరు- ధనమున్నంతవఱకో, లేక బంధుత్వ మున్నంతవరకో, తన్నాశ్రయించి యుందురు. గాననీమాత్రమునకై ప్రేమ వహింప నేల?

క్రౌంచపద వృత్తం. గ్రాహక బుద్ధిన్ స్నేహము నొందం
గ నప్పును బుడుకయొన్ కగినిసమంబై
దేహము నెల్లన్ దాహము సేయుం
జెరువగు ననిమదిన్ దెలిసి సముద్య
త్సాహస వృత్తిన్ మోహము వీడన్
జగతి గిరియుఁ దృణమ్ సదృశతరంబౌ

నైహిక సౌఖ్యోన్నత్తాసహ మమరమో
హాముపిడఁ దగుఁ బరస మభిమత మైనన్. ౭౯

తా. ఐహిక సౌఖ్యము వదిలి పరసౌఖ్య మందిష్టము గలవాండై మోహాముపదలినే నిఁ బర్వత మయిన తృణ సమానం బగును. పరసౌఖ్యము వదిలి యైహిక సుఖ మాశిం చి మోహ జాలమున బడినవానికి తృణమైనను బర్వత సమానముగా గన్పించును.

క. వృక్షమున రాత్రి బహువిధ
పక్షులు వసియించి తెల్లన్ వారంగ యధా
పేక్షలఁ జనుగతి బాధువ
లక్షయముగఁ గూడివత్తుర్ రహ్మో యెడలన్. ౮౦

తా. రాత్రియందుఁ బిట్టలన్నియుఁ జెట్టుమీదఁ జేరి తెల్లవారగనే పోవువిధముగ—ళ త్రపుత్రాది బంధువులా యాసమ యముల ననుసరించి చేరుదురు. గాన వారియందు మోహాము పెట్టికొనుట పట్టిభ్రాంతిచేసుమా?

క. జనులు వెలియపలదె మహాం
బుధిం గాష్ఠములు గొన్ని ప్రోదపికొని నడిం
జనుదెంచి యెడనెడన్ వి
చ్చిన యట్టుల కాదె సకలస్ సృష్టియు నరయన్, ౮౧

తా. ఈప్రపంచ మందలి సృష్టియంతయు— మహాసముద్రమునపయిమండికొట్టుకొ ని వచ్చిమధ్యనొక చోటుఁ గలసి మరల విడిపోవుకట్టెలవిధముగనున్నది గదా? దీనిజూచి మోహాము నొందనేల?

ఉ. తప్పక సర్వబాంధవ వితానము పుత్రులు నిష్టభృత్యులున్
జెప్పఁగ నున్న వారనుచుఁ జిత్తములో నలరున్ జనుండు వా
రొప్పున మోహరజ్జుల నిరుద్ధతిఁ గట్టుము ధర్మమొలఁ ద
న్నొప్పన సేయనున్న శమ నుగ్రపు దాయలుగారె యారయన్.

తా. పుత్రులు- మిత్రులు- భృత్యులు— మొదలగు బాంధవు లందఱు తన్ను సుగ తికి బంపింతురని మానవులు తలంతురు గాని, మోహపాశముల బంధించి యమునిసన్నిధికి గొనిపోవుదురని తలంపనేరరు గదా?.

వ. కావున. ౮౩

తా. కాబట్టి.

క. పుత్రులపై మిత్రులపై
గోత్రులపై నింతసే మోహగుణము నిలిపినన్
సూత్రగతి నది యొనరునకుఁ
జిత్రముగా బాధనంబునే సేయంజాలున్. ౮౪

తా. పుత్రుల మీదగాని, మిత్రుల మీదగాని, సగోత్రుల మీదగాని, మోహమే మాత్రముంచిన నది బంధముచే గలుగజేయును గాని ముక్తి గలుగఁ జేయదు.

తే. గీ. మోహ నిర్మోహములు బంధ ముక్తికార
ణంబులగుటను మోహ గుణంబు ధైర్య
ముదయమను కత్తితోఁగోసి మోక్షసుఖముఁ
జూఱగొనవచ్చు వెసఁ సిది సులభమతము. ౮౫

తా. బంధ ముక్తులకు గారణము మోహనిర్మోహములు- కాన ధైర్యమను కత్తితో మోహలతను నరికివేయ వలయును. ఇట్టుల మోహము జయించి కాని మానవులు ముక్తినొంద జాలరు.

—— మదలక్షణము. ——

చ. సకల కలాకలాప సువి చారదుఁడై మదాంధుఁడయ్యెనే
నొక యెడనైన మంచి గుణ ముల్లమునం జొరనీక సత్క్రియల్
వికలతఁ బొందఁ జాలన వివేకియగున్ శివునాత్మలో నెఱుం
గక భవబద్ధుఁడౌచు నప కారము సేయును సజ్జనాళికిన్ ౮౬

తా. సకల శాస్త్రంబులు నేర్చిన మంచివిద్వాంసుడైనను మదాంధుడైనచోఁ అవివేకియగును. అతనికి మంచి గుణ మొకటియు పట్టుపడదు. శివస్మరణము సేయకయూ తేఁడు సంసార కూపమునఁబడి సజ్జనుల కపకారము సేయుచుండును.

క. విదితముగ నస్థిరపు సం
పదలు నిజములనుచు మెచ్చి ప్రల్లదుఁడై దు

ర్నదుఁడైన చెనఁటి మనుజుం
డా దురెఱుఁగక విఱ్ఱవీఁగు । నిమ్మహిలోనన్. ౮౮

తా. అస్థిరములైన సంపదలను స్థిరమని నమ్మి మదాంధుడు తనకారు నెవరు లేరని విఱ్ఱవీగు చుండును.

చ. సిరిక్రియ గాలిచందమున । శీతమయూఖుని భాతివిద్యుదు
త్కరము తెఱంగు నంది వియ । క్కైవడి నంబుధ రాలిచాడ్పునం
తరుణుల మానసంబుల ప । థంబున వార్ధితరంగ భంగిన
స్థిరములు దేహముల్ మద వి । జృంభితు లౌదురు మర్త్యులేలకో.

తా. సంపదలు- వాయువు- చంద్రుఁడు- మెఱపులు- దీపములు- మేఘములు- తరుణుల మానసములు- తరంగములు- క్షణభంగురములైనటుల దేహములు క్షణభంగురములు గదా?. ఈవిషయమును దెలిసియు మనంబున కన్నుమిన్ను గానక కొందఱు చరించుటకేమి కారణమో గదా!

శా. దేహం బస్థిరమంచు గన్గొనిమదో । ద్రేకంబునం బొందకా
దేహంబు న్మనము న్ధనంబు నతిభ । క్తిన్ సద్గురు స్వామికి
న్నీహారాద్రి సుతామనో హరునకు । న్నిత్యంబు తద్భక్తియు
క్తాహీనాత్ములకు న్వివేకులగు వా । రర్పింతు రెల్లప్పుడున్. ౮౯

తా. వివేకులు దేహమస్థిరమని తలంచి మదోద్రేకము నొందక మహావినయముతో మహాభక్తితో గురుపరేశ్వరులకు తనువును ధనముల నిత్యమునర్పించి సేవించు చుందురు

క. కులశీల రూప విద్యా
బలధనముల వలన మదము । ప్రభవిలు నదియుం
గులశీల రూప విద్యా
బల ధనవంతులనుఁ గనిన । బాయదె జగతిన్. ౯౦

తా. కులముసత్ప్రవర్తనము- ధనము- రూపము- విద్యయు బలమును మానవులకు మదమును బుట్టించును. గానికులశీల రూపధన వంతులగు వారెంతటి దుస్థితి ననుభవించు చున్నారో, యొకసారి పరికించినచో నీధరిత్రి యందే మానవుండు మదంబును బరిత్యజింపడు.

క. కులము గలవారెచట ము
క్తులైరి కులహీను లెల్ల గుది నెచటను ము
క్తులు గారె యోగి జనులే
కులజులుగా కితరులేటి కులజులు దలఁపన్. ౯౧

తా. సత్కులంబున జన్మించిన వారిలో (జాలవఱకు దుష్కార్యము లాచరించి న రకము చెందిన వారే గాని, ముక్తి నొందిన వారరుదు కులవిచారమును వదిలి పరమాత్మను పాసించియే యనేకులు ముక్తి నొందిరి. నిజమువిచారింపఁగా యోగిజనులే కులీనులుగాని యితరుల కులీనులని చెప్పదగునా?

ఆ. వె. నిగమ విహిత శీల నిష్ఠుఁ డూర్ధ్వగతికి
నేగు శ్రుతివిరుద్ధ మింతయైన
నధమ గతికి నేగు నల్లాట నంత సు
శీల వృత్తి ముక్తిఁ జెందు మతియు. ౯౨

తా. వేదానుకూల విధంబున నాచరించిన వారూర్ధ్వ గతికేగుటలో సంశయము లేదు. వేదవిరుద్ధముగ కొంచము ప్రవర్తించినను వాఁడధో గతికే పోవును. కావున సుశీల వృత్తియే యనఁగ సత్ప్రవర్తనయే ముక్తికి మార్గము.

క. మనసిజుని కంటె రూపం
బున నధికులు గలరె యతఁడు పురహరు చేతం
గనుమాయన డఁగి పోయెన
నినఁ దక్కిన రూపు లెవ్వి నిత్యము లరయన్. ౯౩

తా. ఆహా! త్రిలోకంబు లందైనను మన్మథుని కంటె మించిన సౌందర్యశాలి లేఁడుఁగదా! అట్టి మన్మథుఁడు సయితము మీశ్వరునిచే భస్మమై చేయబడెను. ఇఁకనెవ్వఁడీ రూపంబును నిత్యమని నమ్మమదంబుఁ జెందును?.

క. మునుకొని కల్పాంతము దాఁ
క నభ్యసించినఁ జదువులకు కడ యెన్నఁడులే
దనినను విద్యాధికులిం
క నెవ్వరైనను ధరిత్రిలో గనుఁగొనఁ గలరే. ౯౪

తా. కల్పాంతము వరకు జమువు కొనినను, జమువున కంతము లేదనిగి గాని సర్వవిద్యాధికుని నొక్కనినైనను వెలుపడచి చూపించ గలరా? కావున విద్యను జూచికొని గర్వించుట తగదు.

తే. గీ. రజతగిరి లీల నెత్తిన। రావణుండు
వానిఁదన తోఁకఁ గట్టిన। వాలియును న
తని నొకమ్మునఁ దునిమిన। దాశరథియు
బలిమియై నిల్చిరే ధరావల। యమునను. ౯౫

తా. వెండికొండను నవలీలగా నెత్తిన రావణాసురుఁడును, వానిని తనతోకలో బుట్టి చేసిన వాలియును, అతనినొక బాణముచే (బడ)గొట్టిన రాముండును, జని పోయి నారనిన నిక యీధరిత్రి యందెవ్వఁడు బలమును జూచికొని గర్వించును.

క. క్రమమున మనునృప వరుల
ధనము లెంతయుఁ గూర్చిరందు దారంబైనం
దమతోడం గొనిపోయిరె
యమరర్త్య భువనంబునకు నరే యంబారంగా. ౯౬

తా. తొల్లి రాజాధిరాజు లెందఱో ధనము నార్జించి ధరాతల యందున విడిచి చనిరిగాని, వారిలో నొక రైనను వెంట మూట గట్టికొని పోయిరే? కావున ధనంబుఁ జూచి, యేమూఢుఁడు మదంబు వహించును?.

క. ఊహించి యట్లగుటను గ
తాహంకృతి నుండవలయు। ననఘాత్ములు సం
దేహము వలదిది మదజల
వాహాపటలమునకు గంధ। వాహం బెప్పుడున్. ౯౭

తా. జ్ఞానులీరీతిగా నూహించి యహంకారమును వదిలి నిస్సందేహముగా నుండవలయును. మదమేఘమునకు నిటుల విచారించుట ప్రచండ మారుతము వంటిది.

—*మాత్సర్య లక్షణము.*—

శా. మాత్సర్యంబున బ్రుంగవుండె యరుగు పర్ణాగ్రుఁడు వర్జించు వి

